# శ్రీ రామసేవా గ్రంథమాల

## చతుర్థ కుసుమము

గ్రంథకర్త:

యల్లాప్రగడ వెంకటసుబ్బారావు

సిరిపూడి

(రేపల్లె తాలూకా)

—ః శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# నృసింహ శతకము

—: :—

సీ॥ క్షీరపారావార ♦ శ్వేతాంతరీపస్థ
నవరత్నద్వీపంబు ♦ నందుమిగుల ।
జాను మీరెడు స్వర్ణ ♦ శైలాంతరిత కల్ప
వాటిమధ్యంబున ♦ వన్నెమీరి ।
గరుడ పచ్చలతోడఁ ♦ దిరముగా నిర్మింప
బడిన ప్రాకారంబు ♦ నడుమజాల ।
నీలగోమేధిక ♦ నిర్మితోన్నత సౌధ
మధ్యంబు నందున ♦ మానితమగు ।
గీ॥ నట్టి వైడూర్య మండపం ♦ బందు నొప్పు ।
దివ్య చింతామణీ పీఠి ♦ తేజరిలుచుఁ ।
బద్మతోడుతఁ గొల్వుండు ♦ భద్రమూర్తి ।
నవ్యగుణరంహ అల్లూరి ♦ నారసింహ ॥ 1

సీ॥ భువన భాండములను ♦ బ్రోదిసేయగఁ బమ్మ
బుట్టింపఁ జాలెనీ ♦ బొడ్డు తమ్మి ।
ముల్లోక కలుషముల్ ♦ బోకార్పఁ జాలిన
గంగఁగాంచెను పద ♦ కంజయుగళి ।
ముక్కడి రాకాసి ♦ మూకల వధియించి
రాణమీరెడు చక్ర ♦ రాజమొకట ।

దీనుల యాపదల్ ♦ పూని తొలంగింప
నర్హమౌ నభయాత్మ ♦ హస్తవరము ।
గీ॥ దివ్యమంగళ విగ్రహం ♦ బవ్యయకళ ।
వెలగ శ్రీ కాంత నినుగూడి ♦ తొలగు నెల్లు ।
నిత్యకల్యాణ వైభవ ♦ నీరజాక్ష ।
నవ్యగుణరంహ అల్లూరి ♦ నారసింహ ॥ 2
సీ॥ జయ విజయాఖ్యులౌ ♦ సద్భక్త శేఖరుల్
ద్వార పాలకులౌచుఁ ♦ దనరుచుండ ।
సనకస నందన ♦ మునివరుల్ నిరతంబు
నీపాద సేవలు ♦ నెరపుచుండ ।
పద్మ జాతామర ♦ ప్రభుశంకరాదులు
ఆజ్ఞాను వర్తులై ♦ యమరికొల్వ ।
శ్రీమాని నీమణి ♦ స్మితరత్న రోచులు
నీ రాజనములౌచు ♦ నెగడుచుండ ।
గీ॥ భక్తకోటుల యాపదల్ ♦ బాపి నిరత
నిత్యసౌఖ్యాబ్ధిఁ దేల్చగా ♦ నిష్ఠఁబూని
పలురకంబుల వేసముల్ ♦ బడయుదువట
నవ్యగుణరంహ అల్లూరి ♦ నారసింహ ॥
సీ॥ కలశవారాశియు ♦ త్కటవీచిజాలంబు
చేటీగణంబులై ♦ చెన్నుమీర
వటపత్ర విశ్రుతో ♦ ద్భటడోలికారూఢి
చాలనోత్సవమ్మున ♦ జానుమీర
శ్రుతివర్గ కన్యకా ♦ ప్రతతి కీర్తనలంది
యోగనిద్రారూఢి ♦ బాగుమీర

యోగమాయాకాంత ♦ యుక్తినేత్రాబ్జముల్
ముదుగజగంబులు ♦ బెడగు సెడగ
గీ॥ జగతి సర్జన క్రమమంత ♦ సన్నగిలగ ।
యోగనిద్రా ప్రసక్తిచే ♦ నొద్దికగను
నిత్యసత్యాశ్రయోచిత ♦ నిర్మలాత్మ
నవ్యగుణరంహ అల్లూరి ♦ నారసింహ ॥ 4

సీ॥ హారాంబట్టు మేల్వాలు ♦ డంబు మీరెడు మేను
ఘనఘనా ఘనకాంతి ♦ గ్రమ్ముకొనగ
కౌమోదకీశంఖ ♦ ఖడ్గాది సాధన
సామగ్రికరముల ♦ జానుమీర
పద్మాయతాక్షియా ♦ పద్మవక్షస్థలి
కౌస్తుభమణి సఖ్య ♦ గరిమఁగాంచ
హాలకులిశాది రే ♦ ఖలమించు సంచున
పాదాబ్జముల శాంతి ♦ బర్వ దెసల ।
గీ॥ భక్తరక్షణ శీలంబు ♦ బర్వలెత్త ।
దుష్టరాక్షస గణములు ♦ తూలిచనగ ।
నాదు మానస వీధిని ♦ పాదుకొనవె
నవ్యగుణరంహ అల్లూరి ♦ నారసింహ ॥ 5

సీ॥ పతితపావనుడన్న ♦ ప్రథగల్గు నంటకు
పోలగానాయజా ♦ మీళుడుండె
ఆశ్రిత పక్షపా ♦ తాత్ముడౌ నంటకు
శబరి యెంగిలిపండ్ల ♦ సాక్ష్యముండె
భక్తలోకావన ♦ పరతంత్రుడంటకు
భక్తుడౌ దానవ ♦ బాలుడుండె

అఘటనఘటనా స ♦ మర్థుడంటకుఁజాల
సింధువులోనిడ్డ ♦ సేతువుండె
గీ॥ ఇంతకంటెను సా ♦ క్ష్యంబులేలనయ్య
నిన్నె నమ్మితిననుగావు ♦ నీరజాక్ష
మూఢుడంచును విడినాడ ♦ శోకుమయ్య
సవ్యగుణరంహ అల్లూరి ♦ నారసింహ ॥ 6
సీ॥ కాలానలజ్వాల ♦ క్రమ్మ దేరెడిమోము
విస్ఫులింగంబులు ♦ వెడలుకనులు ।
పటపటార్భటిఁజాల ♦ ప్రాపించుదంతముల్ ।
కహకహార్భటితోడి ♦ గళరవంబు ।
తళతళత్కాంతులు ♦ వెలువరించెడిమేను
ధణధణధ్వనుల పా ♦ దములరవము ।
పెళపెళద్ధ్వానముల్ ♦ విలసిల్ల స్తంభమం
దావిర్భవించి య ♦ ద్దనుజపతిని ।
గీ॥ అంకతలమున జేర్చి ని ♦ శ్శంకముగను ।
గుండెలగలించి ప్రేవుల ♦ తుండెములుగఁ ।
జెండి యమపురిఁ జేర్చితి ♦ జీవ మెడపి ।
సవ్యగుణరంహ అల్లూరి ♦ నారసింహ ॥ 7
సీ॥ నీవింతరూపంబు ♦ నీక్షించి శ్రీకాంత
దరిఁజేరి మాడాడ ♦ వెరచియొదిగె
బ్రహ్మాది దేవతల్ ♦ భయమంది నినుఁజేరి
వినుతి సేయఁగలేక ♦ వెరగుపడిరి
సకలభూతంబులు ♦ వికలంబులై పారె
కంపించి గ్రహములు ♦ గతితొలంగె

ప్రళయకాలాభీల ♦ ఫాలనేత్రునిలీల
సంక్షోభమొందెను ♦ జగములెల్ల

గీ॥ పరమభక్తుఁడు దైత్యేశు ♦ బాలకుండు ।
నిబ్బరంబుగ నినుఁజేరి ♦ నిశ్చల మతిఁ ।
ప్రస్తుతించిన శాంతించి ♦ వరములిడితి ।
నవ్యగుణరంహ అహ్లారి ♦ నారసింహ ॥ 8

సీ॥ బంగారుకాంతుల ♦ రంగారు నెమ్మేను
శృంగార రసము చె ♦ లంగిచూప ।
కరములుదొప్పెడి ♦ ఖడ్గాది సాధన
సామగ్రి వీర ర ♦ సంబుఁజూప ।
భక్తరక్షణకళా ♦ పారీణమాహాత్మ్య
మసమానమౌదయా ♦ రసముఁజూప ।
శ్రీ మానినీమణి ♦ స్మితపూర్వభాషలు
రసపుష్టిహాస్యంపు ♦ రసముఁజూప

గీ వివిధరసవర్గ నిలయమై ♦ వేడ్కనొసగు ।
దివ్యమంగళ విగ్రహం ♦ బవ్యయరుచిఁ ।
భక్తలోకంబుఁ దన్పుదు ♦ ప్రాభవమున ।
నవ్యగుణరంహ అహ్లారి ♦ నారసింహ ॥ 9

సీ॥ అణువులో నణురూప ♦ మమరి యుండుటఁజేసి
అణిమ సంసిద్ధినీ ♦ కమరెనయ్య ।
బ్రహ్మాండ భాండముల్ ♦ బరగు కుక్షినిదాల్చి
మహిమ సిద్ధినికాంచి । మసలితయ్య ।
మందరాద్రిని వీపు ♦ నందుఁ దాల్చుటఁజేసి
గరిమయన్ సిద్ధినీ ♦ కొరసెనయ్య ।

వాయురూపంబున ♦ వరలుట లఘిమయన్
సిద్ధి నిన్నెంతయు ♦ చేరెనయ్య
గీ॥ సిద్ధులన్నియు నినుఁజేరి ♦ చెలగు కతన ।
యోగివరులెల్ల సిద్ధిసం ♦ యోగమొంది ॥
నిరతిశయ సౌఖ్యయోగంబు ♦ నెమ్మిగనిరి ।
నవ్యగుణరంహ అల్లూరి ♦ నారసింహ ॥ 10

సీ॥ శ్రీ మహిళామణీ ♦ చిత్తసరోజాత
షట్పదాయితదివ్య ♦ చారుమూర్తి ।
బృందారకావళీ ♦ నందిత నిజశౌర్య
దీపిత నిఖిలాండ ♦ దివ్యకీర్తి ।
దివిజారి దోర్బల ♦ ప్రవిదారణైకాత్మ
సత్కథావిదళిత ♦ సజ్జనార్తి ।
యోగిమానస పద్మ ♦ యోగప్రథిత సచ్చి
దానంద రూపస ♦ దాత్మవర్తి ।
గీ॥ నిరత కల్యాణదాయక ♦ నిఖిలమూర్తి ।
భరితనిజదాసపోష కృ ♦ ద్భవ్యమూర్తి ।
భజనచేసెద నిరతంబు ♦ భద్రమూర్తి ।
నవ్యగుణరంహ అల్లూరి ♦ నారసింహ ॥ 11

సీ॥ క్షీరపారావార ♦ సారాహి తల్పంబు
చేరిచెన్నలరారు ♦ చిన్మయాత్మ
పక్షిరాడ్వాహన ♦ భద్రసంచారివై
నిరతంబు వెలిఁగొందు ♦ నీరజాక్ష
శ్రీ రమామణి వక్ష ♦ సీమకౌస్తుభముతో
దాల్చి వెలింగెదు ♦ దైవరాయ ।

బ్రహ్మాది దేవతా ♦ పాళికి నండవై
నిరతంబుఁ ♦ గాచెడు నీలవర్ణ ॥
గీ॥ భక్తజన రక్షదానవ ♦ పక్షశిక్ష ।
నిన్నుఁగొల్చెదఁ గృపజూడు ♦ నీరజాక్ష
రమ్ము కావంగ చేయంగ ♦ రాదు పేక్ష
నవ్యగుణరంహ అల్లూరి ♦ నారసింహ ॥ 12
సీ॥ పాలసంద్రంబున ♦ బాలుండవై యొంటి
మఱ్ఱియాకుననీవు ♦ మసలినావు ।
అటుపైని జగముల ♦ నిటు వెలుంగఁ జేయ
లీలమై మాయలోఁ ♦ దేలినావు
అజశంకరాది క ♦ మైన రూపంబుల
వెలయించి జగముల ♦ నిలిపినావు
పుట్టగా వెలయంగఁ ♦ గిట్టగా కారణం
బీవమై నిత్యంబు ♦ వెలసినావు
గీ॥ నీదుమహిమంబు గానగా ♦ నేరకకట ।
శంకరాదులు భ్రాంతులై ♦ చనుటకలుగ ।
పామరుండను జడుడనా ♦ పాటియెంత ॥
నవ్యగుణరంహ అల్లూరి ♦ నారసింహ ॥ 13
సీ॥ జగదండజాలముల్ ♦ జాలసృష్టియొనర్చు
పెద్ద వేలుపునీదు ♦ పెద్దకొడుకు ।
ప్రసవబాణంబుల ♦ పసఁబాపి జనపాళి
కెన్నికఁగాంచె నీ ♦ చిన్నకొడుకు ।
లేమియన్మాటకు ♦ లేమి నెక్కొనఁజేయ
వలతి నీభార్య యా ♦ కలిమి చెలువ।

ఈ గేడు లోకముల్ ♦ భారంబుఁబూనిన
చిలువరాయుడు నీకు ♦ చెలిమికాడు
గీ॥ చావుపుట్టుక లేకుండ ♦ చాగుమందు
నీదునెలవున పుట్టుక ♦ నెమ్మినొందు
పరగ నీరూపుఁ జూడంగ ♦ బలపసందు
నవ్యగుణరంహా అల్లూరి ♦ నారసింహా॥ 14
సీ॥ యిల్లాలు నిరతంబు ♦ నిల్లిల్లు చరియించు
జ్యేష్ఠుడు సంపూజ్య ♦ నిష్ఠఁగనడు ।
కోడలు తలవాకి ♦ టోడక నివసించి
మాటకారి యనంగ ♦ మహిని వెలసె ।
రెండవ పుత్త్రుండు ♦ గండడంగి నశించె
రుద్రకోపానలో ♦ పద్రవమున ।
సప్పంబు పడగ క్రిం ♦ దెప్పుడు నిలయంబు
వాహానంబునకద్ది ♦ నైరకారి ।
గీ॥ భార్యబిడ్డల నిలయంబు ♦ పరగఁగాంచి ।
దారురూపంబు గైకొంటి ♦ దర్పమణగ ।
నంచితంబుగ నాజగ ♦ న్నాదపురిని ।
నవ్యగుణరంహా అల్లూరి ♦ నారసింహా ॥
సీ॥ కలిమిచేడియ పాద ♦ కంజంబులనుబూని
సంవాహానంబును ♦ సల్పుచుండ ।
పోరోగిరము తిండి ♦ పోతునిరాబారి
తంబురబూని నృ ♦ త్యంబు సల్ప ।
వేల్పుపెద్ద జగంబు ♦ వేడుక సృజియింప
శక్తికై కొలున ♦ రక్తిఁగొల్వ ।

వెండికొండ నివాసి ♦ వేదురు పెడబాసి
విమల నామము భక్తి ♦ మమతనుడువ ।
గీ॥ ఆశ్రితామర కల్పకం ♦ బనగఁ దనరి ।
దివ్య వైకుంఠ మణిపీఠిఁ ♦ దేజరిల్లు
నిన్నుమదినిల్పి కొల్చెద ♦ నీలవర్ణ !
నవ్యగుణరంహ అల్లూరి ♦ నారసింహ॥ 16
సీ॥ హృదయాబ్జమున రూపు ♦ వదలకఁ దాల్చిన
సారూప్య పదవిచే ♦ కూరగలుగు ।
నిరతంబు నీమంత్ర ♦ నిష్ఠనుజపి యింప
సాన్నిధ్యమును చేరఁ ♦ జాల కలుగు ।
బరువడి నీనామ ♦ భజన సేయుచు నున్న
సాయుజ్యమును పొందు ♦ సరణికలుగు ।
నీదాస జనులను ♦ నెమ్మిసేవించిన
సాలోక్యమును కాంచు ♦ మేలుకలుగు ।
గీ॥ దాసదాసుల దాసుండ ♦ దైవరాయ ।
శాస్త్ర మర్యాద లెఱుగని ♦ జడుడ కరుణ ।
నీకటాక్షంబు నించుక ♦ సోకనిమ్ము ।
నవ్యగుణరంహ ! అల్లూరి ♦ నారసింహ ॥ 17
సీ॥ శీతశాతాతప ♦ స్ఫీతమాతపముల
బలునిష్ఠఁ గైకొని ♦ సలుపలేను ।
యోగ మార్గముఁబట్టి ♦ రాగాది కంబుల
నెడలించికాయంబు ♦ నడపలేను ♦
శృత్యుక్త కర్మముల్ ♦ నిత్య నైమిత్తిక ।
మన్యూనముగఁ దీర్చి ♦ యలరలేను ।

యజ్ఞయాగాదులన్ ♦ ప్రాజ్ఞత నొనరించి
దైవత కోటిని ♦ దన్పలేను ।
గీ॥ నిరతమును నీదురూపుహృ ♦ త్సరసి జమున ।
నిల్పి సేవింతు భజియింతు ♦ నీరజాక్ష! ।
దుర్భరంబైన భవపంక్తిఁ ♦ దొలగఁజేయు ।
నవ్యగుణరంహ! అల్లూరి ♦ నారసింహ! ॥ 18
సీ॥ పరవిత్తహారియౌ ♦ కరకు బోయఁడొకండు
పరమ భక్తుండౌచుఁ ♦ బ్రబలినాడు ।
దుష్టదానవగర్భ ♦ శిష్టుఁడౌ బాలుండు
పరమ భక్తుండౌచుఁ ♦ బ్రబలినాడు ।
పరమ శత్రుండైన ♦ సురవైరి తమ్ముఁడు
పరమ భక్తుండౌచుఁ ♦ బ్రబలినాడు ।
వానర జాతీయు ♦ డైన సుగ్రీవుండు
పరమ భక్తుండౌచుఁ ♦ బ్రబలినాడు ।
గీ॥ నీదుమహిమంబు నెన్నంగ ♦ నేరి తరము ।
వాణికైనను వేనోళ్ల । వానికైన ।
సర్వలోకాధి నాయక! ♦ శర్వవినుత! ।
నవ్యగుణరంహ అల్లూరి ♦ నారసింహ ॥ 19
సీ॥ పిడికెడటుకులను ♦ బెట్టు కుచేలుండు
సర్వసంపదలొసగఁ ♦ జాలినావు ।
ఎంగిలి పండుల ♦ నేర్పరించి యొసంగు
శబరికి మోక్షమీ ♦ జాలినావు ।
ఒకపరిమై పూత ♦ నొసగిన కుబ్జకు
శాశ్వతానంద మీ ♦ జాలినావు ।

మకరికి జిక్కి ప ♦ ల్మారు నిన్నేడిన
గజరాజు నాపదఁ ♦ గాచినావు
గీ॥ నేను నిరతంబు నీపద ♦ నీరజములు।
మానసంబుననిల్పి ప ♦ ల్మారు వేడ।
కావకుండుట ధర్మమా ♦ కమలనయన!।
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా!॥ 20
సీ॥ పాలసంద్రమునందు ♦ లీలమందరగిరి।
కవ్వంబుగాఁజేసి ♦ మవ్వమునను।
వాసుకి తరిత్రాడు ♦ చేసి పూనికమీఱ
నమృతంబుఁ బడయగ ♦ నాసఁజేసి
దేవతలోకచక్కి ♦ దితిజాళియొకపక్కి
నిల్చిమిక్కుటమైన ♦ నేర్పుతనరఁ।
ద్రచ్చగా నమృతంబు ♦ దార్కొననిరువాగు
పోరాటమొనరింపఁ ♦ బుప్పబోడి।
గీ॥ రూపు-గైకొని వారించి ♦ యేపుఁబాపి।
అమరులకునెల్ల నమృతంబు ♦ నమరఁజేసి।
దైత్యులను గీటుబుచ్చితి ♦ దైవరాయ
నవ్యగుణరంహా అల్లూరి ♦ నారసింహా॥ 21
సీ॥ అవని నుత్తానపా ♦ దాఖ్యుడౌ నరపతి
గర్భోదధికి చంద్ర ♦ కల్పుడగుచు।
ధృవనాముడున్నత ♦ ధీవిరాజితుడిచ్చ
సాపత్ని మాతృ ప్ర ♦ సక్తి నెగడి।
కడుపరాభవమొంది విడచి సద్మముకానఁ
జేరి తపోనిష్టఁ ♦ జెలగినిన్ను।

పలుమరు వేడంగ ♦ విలస ద్దయామతి
సాక్షాత్కరించి య ♦ క్షయపదంబు ।
గీ॥ నొసగి బ్రోచితివనుఁ గావ ♦ మసలు టేల
పక్షపాతంబు తగునయ్య? ♦ పద్మనాభ! ।
భక్తరక్షణశీల! కృ ♦ పాలవాల! ।
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా! ॥ 22
సీ॥ రాజ్యభ్రష్టులు పతుల్ ♦ పూజ్యులు వనములో
కాయలాకులుతిని ♦ కష్టమొంద ।
పతులె దైవములంచు ♦ భావంబు దీపింప
కానల కడగండ్లఁ ♦ గనుచునవయ ।
దుర్వాసుడొకనాడు ♦ గర్వోన్నతిని వేయి
శిష్యులగూడుక ♦ ప్రేష్యుడగుచు।
అన్నంబు యాచింప ♦ నంతకుమున్నె తా
కుడిచివిడచినవట్టి ♦ కుండఁజూచి ।
గీ॥ వేయిమందికినన్న మే ♦ చాయ నిడుదు ।
ననుచు చింతించి ద్రౌపది ♦ నినుదలంప
భక్ష్య భోజ్యంబు లొసగిత ♦ వ్వారిగాగ ।
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహ ॥ 23
సీ॥ దురితాత్మకుండైన ♦ కురుపతియన్యాయ
పద్ధతి జూదంబు ♦ వరలఁ జేసి ।
సకలరాజ్యంబును ♦ ఛలవృత్తిఁగైకొన
పాండవుల్ భంగము ♦ పాల్పడంగ ।
పాపబుద్ధినిసాధ్వి ♦ ద్రౌపది సభఁజేర
రప్పించిపుట్టముల్ ♦ విప్పఁజేయ

మానభంగమునొంది ♦ మానినిపల్మారు
నార్తరక్షణ కళా ♦ మూర్తినిన్ను
గీ॥ దలచఁ బ్రోపయి ♦ తరుగని పలువ లొసగి
గాసిఁ దీర్చితివై కుంఠ ! వాసవనుత !
కొంగుబంగారుగద నీదు ♦ సంగడంబు
నవ్యగుణరంహా ! అల్లూరి ♦ నారసింహా ॥ 24
సీ॥ వేదంబులను చోర ♦ వృత్తిఁ గైకొని సోమ
కాసురుం డబ్ధిలో ♦ నొసరిల్ల
బ్రహ్మాదిదేవతల్ ♦ భంగంబుపాల్పడి
నినుఁ జేరి ప్రార్థనల్ ♦ నెరపినంత
మత్స్యరూపముఁదాల్చి ♦ మహితాబ్ధిలోఁజొచ్చి
దాగియున్నట్టి యా ♦ దనుజవరుని
యముఁ జేరఁబంచి వే ♦ దములెల్లఁ గైకొని
బమ్మకొసంగిన ♦ పరమపురుష !
గీ॥ భక్తసంచయ హృద్వర్తి ! భవ్యమూర్తి !
నిరతశయసౌఖ్య దాయక ♦ నిత్యకీర్తి ! ।
నన్నుకడతేర్చు మంటినా ♦ పన్నుడంటి ।
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా! ॥ 25
సీ॥ మందరగిరి కవ్వ ♦ మొందించి వాసుకి
తరిత్రాడుఁ జేసియా ♦ సురచయంబు ।
దనుజసంఘము క్షీర ♦ వననిధిఁ ద్రచ్చగా
నామహీంధర భార ♦ మధికమగుట ।
గిరివార్ధిలోపల ♦ జొరబడ యత్నంబు
విఫలమై వేల్పులు ♦ వేడనిన్ను ।

కూర్మరూపముఁబూని ♦ గొబ్బున వీపుపై
గిరిఁదాల్చి వారల ♦ కరుసమిడితి ।
గీ॥ ఆశ్రితావనదక్ష ? ప ♦ ద్మాయతాక్ష !
నతజనామరవృక్ష ! పం ♦ డితసమీక్ష !
భక్తజన రక్ష ! దైతేయ ♦ వారశిక్ష !
నవ్యగుణరంహ! అల్లూరి ♦ నారసింహ! 26
సీ॥ కులగిరుల్ వడిఁదూలి ♦ కుంభిన్నిపై వ్రాల
వ్రేళ్లతోవృక్షముల్ ♦ పెళ్లగిలఁగ ।
జంతుసంతానంబు ♦ సంక్షోభమును చెంద
సంబుధి మిన్నంటి ♦ యవని ముంప ।
గ్రహతారకాగణం ♦ బహుమికఁ గోల్పోవ
దిక్కరుల్ చేటొంది ♦ దిక్కుసెడఁగ
దుష్టుడౌకనకాక్షు ♦ డష్టదిగ్వలయమా
పుడమిని చాపచు ♦ ట్ట దరఁజేయ
గీ॥ జీవకోటుల కడరిన ♦ చెట్టమాన్ప ।
క్రోడ మైదాన వాధము ♦ క్రొవ్వడంచి ।
యమపురినిజేర్చితివి పరా ♦ క్రమమెలర్ప
నవ్యగుణరంహ! అల్లూరి ♦ నారసింహ 27
సీ॥ తనశీలముకుతోడు ♦ తగు పరాక్రమమొప్ప
త్రిభువనరాజ్యంబు ♦ తేజుమీరి
భుజపీఠిఁదాల్చి య ♦ క్కజమైన దాతృతా
మహిమ సమానుడీ ♦ మహితలమున
లేడని జనులెన్న ♦ రేడు బలీంద్రుండు
యజ్ఞదీక్షనుబూన ♦ ప్రజ్ఞమీర

వటువు వేసముదాల్చి ♦ కుటిలమానసమున
విభుఁజేరి దానంబు ♦ వేడిభువిని
గీ॥ మూడుపదములఁ గైకొని ♦ మూడులోక
ములను నీవాక్రమించితి ♦ వలఘుమతిని
వామనాకృతిఁ గైకొన్న ♦ వారిజాక్ష!
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా! ॥ 28
సీ॥ ధరసిదం బ్రాహ్మ్యమి ♦ దంతౌత్రమనునుడి
సత్యమౌనీతని ♦ చాయనంచు
లోకులునుతియింప ♦ లోకాతిభీకర
పటుపరాక్రమమున ♦ దిటవుమీరి
క్షత్రసంతతినెల్ల ♦ సంహరించి తదస్ర
మునపితృతర్పణం ♦ బొగినొనర్చి
కాశ్య పిభూసురా ♦ ఖండలున కొసంగి
శాంతవృత్తి తపంబు ♦ సల్పనేగి ।
గీ॥ తమల విప్రాన్వయంబున ♦ నవతరించి ।
పరశురామాఖ్య భువిలోన ♦ బరిగినావు
దుష్టజన శిక్ష! దోర్బల ♦ ధుతవిపక్ష! ।
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా! ॥ 29
సీ॥ నీలమేఘుచ్ఛాయ ♦ నెమ్మిగుల్కెడు మేన
కలధౌత వస్త్రంబు ♦ కటిఁదలిర్ప ।
కరధృత చాప పు ♦ ష్కల బాణతూణముల్
అందంబునకు వింత ♦ యంద మొసగ ।
దీనపోషణ కళా ♦ ధీన దృక్పాళికి
వరదా భయకరంబు ♦ లొరసి మెరయ ।

ఆశ్రిత కల్పకం ♦ బన నైనతవరూపు
మంగళ దేవతా ♦ ప్రాంగణముగ ।

గీ॥ వెలయ పరిపరిధి దైత్యుల ♦ వీటిబుచ్చి
దేవఋషి మానవౌఘంబు ♦ ధీరవృత్తి
నోమినాడవు దశరథ ♦ రామచంద్ర !
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా!॥

సీ॥ ఘనఘనాఘనలక్ష్మి ♦ క్రమ్ము దేరెడిమేను
పసిడిపుట్టపుకాంతి ♦ భంగపరుప ।
నీరజారిప్రభల్ ♦ నిగ్గు దేరెడిమోము
మకరకుండలదీప్తి ♦ మాటుసేయ
ఫుల్లాబ్జపత్ర వి ♦ స్ఫురితనేత్ర యుగంబు
దివ్యత్కటాక్ష వి ♦ తీర్ణ నెరప
ప్రధమాన కారుణ్య ♦ ప్రస్ఫురత్సూక్తులు
శృతి కామినీ దాస్య ♦ ప్రతినఁజాట

గీ॥ అభయవరదాయ కోత్కట ♦ విభవములను ।
వామదక్షిణకరములు ♦ వలసుసూప ।
అంచితంబుగ నతులఁ బా ♦ లింతువెపుడు
నవ్యగుణరంహా ! అల్లూరి ♦ నారసింహా! ॥ 31

సీ॥ నీపాదకమలము ♦ దేపారజనిఁగాంచి
గంగ త్రిలోక వి ♦ ఖ్యాతిఁగాంచె
నీనాభిపద్మ వి ♦ న్నాణంపు పుట్టుక
ధాత లోకసృష్టి వి ♦ నేతయయ్యె

నీ యాశ్రయంబున ♦ నెగడుచుండుటఁ జేసి
విసదారిరాయుడు ♦ మిసిమిగాంచె
నిన్నుఁగొల్చుటఁ జేసి ♦ పన్నగారివిభుండు
వందనీయుండను ♦ వార్తకెక్కె।
పతితపావన బిరుదుతో ♦ నుతినిగన్న।
నిన్నుసేవించి తరియింప ♦ నిష్ఠఁబూని।
భక్తినేఁగొల్తు కరుణింపు ♦ పరమపురుష।
సర్వగుణారంహ అల్లూరి ♦ నారసింహ ! ॥ 32
। నీపాదరజముదా ♦ నించుకసోకిన
చట్రాయినాతియై ♦ జానుమీరె।
నీదివ్యరూపంబు ♦ నీక్షించి శబరితా-
నుత్తమ లోకంబు ♦ పొత్తుఁగాంచె।
నీబాణపాతంబు ♦ నెనసిన తాటకి-
శాపముక్తిని కాంచి ♦ చానయయ్యె।
నీకరుణారస ♦ నిర్మగ్నుడై ! కోతి -
బ్రహ్మపదంబును ♦ బడయఁగల్గె
నీదుమహిమంబు - నెన్నంగ - నేరకకట
వేయి శిరముల శేషుండు ♦ తోయధిఁబడి
నిన్ను మోయుచు బ్రతుకును ♦ గన్నవాడు
సర్వగుణారంహ అల్లూరి ♦ నారసింహ ! 33
నిర్వికల్పుడ జుండు ♦ నిర్గుణుండు పరుండు
నిర్వికారి యనాది ♦ నిశ్చలుండు ।
నామరూపవిహీను ♦ డామహాదాదిక -
నిఖిల ప్రపంచవి ♦ నిష్ఠితుండు

గుణహీనుడుగనయ్యు ♦ గుణియాచుఁబ్రకృతితో
సంబంధి యగుచుదా ♦ నంబరముఖ
పంచభూతాత్మక ♦ మంచిత భూతస
ర్గము సేయనాభిని ♦ కమల భవుని
గీ॥ వెలయఁ జేసి జగజ్జాల ♦ ములనుమన్ప
కరుణఁబూనితి సంహార ♦ కలన గిరిశు
డనగ నిను సన్నుతించనా ♦ కలవి యగునె
నవ్య గుణరంహా! అల్లూరి ♦ నారసింహా ॥ 34
సీ॥ శరణాగతత్రాణ ♦ బిరుదుగల్గుటకునీ
పగవాని తమ్ముడు ♦ పరగసాక్షి
పతితపావనుడను ♦ ప్రథగల్గు నంటకు
గౌతమునిల్లాయి ♦ గట్టిసాక్షి
సారిదియ మోఘసం ♦ గరుడౌట కెంతయు
ఖరదూషణాదుల ♦ కలనసాక్షి
తన బాణముడివోవ ♦ జనదు నానుడికిని
భార్గవరాముండు ♦ ప్రబలసాక్షి
గీ॥ రాజ్యమును వీడి యడవుల ♦ రాణమీర
నీవు వసియించుటది ధర్మం ♦ నిష్ఠసాక్షి
నీచరిత్రమనువర్ణింప ♦ నేరనయ్యఁ
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా !
సీ॥ కాకపక్షములొప్ప ♦ గా గాధిసూనుని
మఘముఁ గావగఁబోయి ♦ లఘువిధమున
దుష్టరాక్షసవీర ♦ దోర్బలంబడగించి
సవమునిర్విఘ్నమా ♦ చాయ నెరపి

మాని ప్రీతునిఁజేసి ♦ మానితశస్త్రాస్త్ర
కోటిని గైకొని ♦ దీటులేని
తేజంబెలర్పగా ♦ నా జనకాత్మజ
చేపట్టి పితరులు ♦ చెందప్రీతి
గీ॥ లోకకల్యాణమునుకూర్చ ♦ జొకఁదనర
సారిది సాకేతపురిజేరి ♦ పౌరజనుల
కనులపండువొనర్చితి ♦ కౌసలేయ!
నవ్యగుణరంహ అల్లూరి ♦ నారసింహ ! 36
సీ॥ గౌతమాహల్యల ♦ ఘనకుటుమికినీదు
వరమూర్తిసంధాన ♦ కరణికాదె
శైలాకృతిఁదొలంగి ♦ జీవించపదరజం
బరుదుగాసంజీవ ♦ కరణిగాదె
జటినాథు మానసో ♦త్కటశంక నెడలింప
వరవాక్సుధవిశల్య ♦ కరణికాదె!
దివ్యమంగళ విగ్ర ♦ హావ్యయ దర్శనం
బరుదుగా నమృత ♦ కరణికాదె
గీ॥ ఇట్టిలోకైక మాహాత్మ్య ♦ ముట్టిపడెడు
నీ చరిత్రమువర్ణింప ♦ నేరితరము
వాణికైనను వేనోళ్ల ♦ వానికైన
నవ్యగుణరంహ ! అల్లూరి ♦ నారసింహ ! 37
సీ॥ కాకాసురునిపైన ♦ గడ్డిపోచనుపూని
బ్రహ్మాస్త్ర మొనరించు ♦ ప్రజ్ఞఁగనిన
పదరజంబునుతార్చి ♦ మాని నాతికి రాతి
రూపుఁబాపినయట్టి ♦ కోపుఁగనిన

కోతిరాజునునొక్క ♦ కోలనుగూల్చిన ।
పోటుమగంటిమి ♦ పాటుఁగనిన
సప్తతాళములొక్క ♦ సాయకంబునగూల్చి।
వన్నెమీరినయట్టి ♦ చిన్నెఁగనిన
గీ॥ వీరరసమొక్క తీరున ♦ పారమొనసి ।
సార నరరూపమునుకాంచె ♦ నారయనుచు।
అద్భుతానంద రసముల ♦ నంతములగు
సద్గుణారంహ! అల్లూరి ♦ నారసింహ! 38
సీ॥ ఏకపత్నీవ్రతం ♦ చేపారియుంటకు
సవములో హేమ భూ ♦ జాతసాక్షి
పితృవాక్యరణ సం ♦ ప్రీతుడంటకుదండ
కాటవి వాసంబు ♦ గట్టిసాక్షి
భ్రాతృవత్సలబుద్ధిఁ ♦ బరగుట కాత్మీయ
పాదుకాదానంబు ♦ ప్రబలసాక్షి
జనవాక్య కరణ దీ ♦ క్షనుకల్గి యుంటకు
పుడమి చూలడవిలో ♦ విడుటసాక్షి
గీ॥ ఇట్టిమహనీయ ధర్మ వి ♦ నీతి మెరయ
ధరణిఁ నాదర్శప్రాయమై ♦ తనరువర్త
నంబువిలసిల్ల రహిఁ గాంచి ♦ నావు మిగుల
సద్గుణారంహ! అల్లూరి ♦ నారసింహ!
సీ॥ నిరతంబు నీనామ ♦ స్మరణంబువిడువకఁ
జేయంగనేర్చిన ♦ జిహ్వజిహ్వ
సతతంబునీరూపు ♦ మతిఁ దాల్చిభక్తితో
మానసకేసేవించు ♦ మనమమనము

అనిశంబునీకథల్ ♦ ఘనసంతసముతోడఁ
దవిలి వినంగనౌ ♦ చెవులుచెవులు
ప్రొద్దు నీమూర్తి ♦ నింపుమై పూజింప
నరుసంబుఁబూనిన ♦ కరముకరము
గీ॥ చిరమునీక్రోలమ్రొక్కెడు ♦ శిరము శిరము
వరుస నినుఁగూర్చిపల్కెడు ♦ వాక్కువాక్కు
ప్రబలముగనిన్నుఁ జేర్చిన ♦ భక్తిభక్తి
నవ్యగుణరంహా! అల్లారి ♦ నారసింహా! 40

సీ॥ నీపాదరాజీవ ♦ మేప్రొద్దు మదినిల్పి
తాపత్రయమువీడి ♦ పాపముడిగి
నిర్మలమాన సం ♦ బర్మిలిఘటియించి
నిర్మమత్వముఁబూని ♦ పేర్మిఁగాంచి
వాగాది కంబుల ♦ నాగివాయువునిల్పి
రాగ ప్రవృత్తిని ♦ లోగఁజేసి
స్థిరమానసమున నీ వరమూర్తిఁదర్శించి
పరమభక్తుండన ♦ వరలుజనుడు
గీ॥ పుట్టువును చావులేనట్టి ♦ గుట్టుఁగాంచి
చెట్టలను పాపి ముక్తి ♦ కేల్వట్టిచెలగు
వట్టిమానిసికెటులబ్బు ♦ నిట్టిపదవి
నవ్యగుణరంహా! అల్లారి ♦ నారసింహా! 41

సీ॥ కాలమేఘచ్ఛాయఁ ♦ గాదు శాదనుచాయ
తను కాంతి దిక్కులఁ ♦ దారసిలగ
మెరుపు తీగెల కాంతి ♦ మరపించు పుట్టంబు
కటి భాగమందున ♦ గ్రాలుచుండ

శ్రీవత్స కౌస్తుభ ♦ శ్రీకాంతలురమున
నిరవు చేకొనికడు ♦ మెరయు చుండ
శంఖ చక్రాదిక ♦ సాధన జాలంబు
కరము లందున నిల్చి ♦ వరలుచుండ
గీ॥ భక్త కోటుల రక్షింపఁ ♦ బ్రాపునగుచు
దుష్ట గణములఁ దూలింతు ♦ విష్టవరద
దివ్యమంగళ విగ్రహా! ♦ అవ్యయపద !
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా! 42
సీ॥ యాదవ వంశమ్మ ♦ పాథోధి చంద్రుడై
అఖిల కళా పూర్ణు ♦ డై వెలింగి
దేవకీ వసుదేవ ♦ దివ్యదంపతులకు
ఆనంద దాయకు ♦ డగుచు వెలసి
రుక్మిణీ సత్యాది ♦ రోలంబ వేణుల
కనురాగ పాత్రుండై ♦ తనరిచాల
దుష్టధరానాథ ♦ కష్టదాయకు డౌచు
నలుదెసల్ దనశౌర్య ♦ మొలయకీర్తి
గీ॥ నెనసి భూభారముడిగించి ♦ ఘనతరకృప
పార్థునకు నాత్మ విజ్ఞానమ ♦ పారముగను
వెలయఁ జేసితికృష్ణాఖ్య ♦ విశ్వ వినుత!
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా! 43
సీ॥ జగతీతలంబున ♦ సర్వమానవకోటి
కర్మపాశంబులై ♦ జ్ఞానమార్గ
మును దొరంగిచరింప ♦ పొందుగా తత్వ వి
జ్ఞాన దాయకుడౌచు ♦ కలుషముడిపి

గౌతముబుద్ధుడై ♦ నూతనమగు బౌద్ధ
మతమును ధరలోన ♦ మానితముగ
శిష్యప్రశిష్యసం ♦ ప్రేష్యమై వెలయంగఁ
జేసితి కరుణా వి ♦ శేషవృత్తి
గీ॥ సర్వజీవుల దుఃఖంబ ♦ ఖర్వమతిని
బాప కంకణమునుతాల్చి ♦ పరగినావు
దీనజనరక్ష ! యాచక ♦ దివ్యవృక్ష !
నవ్యగుణరంహ! అల్లూరి ♦ నారసింహ ! 44
సీ॥ కలియుగంబునధర్మ ♦ విలయంబు కలుగంగ
మానవావళిదుష్ట ♦ మార్గగతుల
మరగిసత్యమువీడి ♦ జారత్వచోరత్వ
మాదిదుష్కర్మ స ♦ మృద్ధితులుగ
చరియించి దేవతా ♦ గురుభక్తి హీనులై
పశుతుల్యులైచాలఁ ♦ బరగుచుండ
కల్కిరూపునుదాల్చి ♦ ఘనపరాక్రమ మొప్ప
ధర్మవిద్వేషుల ♦ దండనంబు
గీ॥ సలిపి ధర్మంబు నెలకొల్ప ♦ జాలుదీవె
భక్తజనరక్ష ! మునిసంఘ ♦ భరణదక్ష ! ।
ఆశ్రితామరవృక్ష! పద్మా ♦ యతాక్ష!
నవ్యగుణరంహ ! అల్లూరి ♦ నారసింహ! 45
సీ॥ తనయాలుబిడ్డల ♦ మనుపనన్యులవిత్త
మునుపొందఁగోరు దు ♦ ర్మనుడొకండు
తనలాభమునకునై ♦ యనుదినంబితరుల
ఘనకష్టములఁబెట్టు ♦ కష్టుడొకడు

తనకీర్తి కాంతుచే ♦ ననిశంబు నితరుల
కును నిందలను కూర్చు ♦ కూళ యొకఁడు
తనసౌఖ్యమునుగోరి ♦ జనుల నందరకష్ట
ములఁగూర్చి బాధించు ♦ మూర్ఖుఁడొకఁడు
గీ॥ నిత్యమును స్వీయలాభంబె ♦ నిష్ఠయగుచు
దనర నాజీవితంబును ♦ తత్పరులగు
ఖలులు ప్రబలంగ సాధుల ♦ గతి యికేది
నవ్యగుణరంహా అల్లూరి ♦ నారసింహా ! 46

సీ॥ తనకులాచారంబు ♦ ఘనమంచునితరుల
కసరికొట్టఁగఁజూచు ♦ ఖలుఁడొకండు
తన వైదుషీ గర్వ ♦ మును గాంచి యితరుల
కల్పత్వము ఘటించు ♦ యల్పుఁడొకఁడు
తనబుద్ధి వైభవం ♦ బని తరమనియొడ్ల
చులకనఁజూచెడు ♦ మలినుఁడొకఁడు
తనసంపదఁ దలంచి ♦ మనమున నితరుల
నీచముగాఁజూచు ♦ కోఁచ యొకఁడు
గీ॥ సతము తనగొప్ప తనమెతా ♦ మతిఁదలంచి
పలఁదుధిక్కార మొనరింత్రు ♦ పాపు లకట
సాధుజనరక్ష నీకెకా ♦ సారసాక్ష
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా! 47

సీ॥ తన తప్పులను క్రమ్మ ♦ దల జేయఁదమకించు
నెదుట వారల తప్పు ♦ వెదుకఁ జూచు
తన లాభమును గోరి ♦ ఘననీచముల కోర్చు
నొరుల నష్టము గూర్చ ♦ నురవడించు

తనకీర్తి వేనోళ్ల ♦ తానె పొగడబూను
ఇతరుల కపకీర్తి ♦ నిడ దలంచు
తనపాండితి నిరం ♦ తరము గొప్ప నొనర్చు
పరుని విద్యను హీన ♦ పరుపఁ గోరు
గీ॥ నిట్టిదుర్మార్గ చరుతైన ♦ నీచ నరుల
పట్టి పల్లార్చి బుధులచే ♦ పట్టి బ్రోవ
యుక్తమగుఁ గాదె భక్తసం ♦ సక్త హృదయ
నవ్యగుణరంహ! అల్లూరి ♦ నారసింహ! 48
సీ॥ నిదుర మేల్కాంచిన ♦ మొదలుగా పరధనా
హారణంబెకృత్యమౌ ♦ దురితుఁ డొకడు
పరకాంతలను కాంచి ♦ పాపచింతనతోడ
గనయఁ గోరెడునట్టి ♦ కష్టుఁడొకడు
కూట సాక్ష్యంబుల ♦ దీటులేక తనర్చి
పరుల బాధించెడు ♦ భ్రష్టుఁడొకడు
కల్ల నిజంబుల ♦ తల్లడిల్లగఁ జేసి
సాధు బాధనొనర్చు ♦ జాల్ముఁడొకడు
గీ॥ పలుతెరంగుల ధర్మంబు ♦ భంగపరుప
మానవాధములీ కలి ♦ లోన ప్రబలి
పెంపుబొందిరి న్యాయంబు ♦ జేలుపడియె
నవ్యగుణరంహ అల్లూరి ♦ నారసింహ! 49
సీ॥ పరకాంతలను గన్న ♦ భావమందున మాతృ
సమముగా నెంచెడు ♦ సాధుజనుడు
పరధనమెంతయు ♦ పటులోష్ట సమముగా
మానసంబున గాంచు ♦ మహిత గుణుడు

ఎంత కష్టంబున ♦ కేనియు నోర్చి తా
సత్యవాక్యమె పల్కు ♦ సచ్చరితుడు
అణువునుండియు బ్రహ్మ ♦ మందాక సర్వంబు
దైవతా రూపంబుఁ ♦ దలచు ఘనుడు
తే॥ గీ॥ నిత్య నిరుపమ శాశ్వత ♦ నుత్యపదవి
బొంది సుఖియింతురెంతయు ♦ భువిని మరల
పుట్టుకను కాంచనేవరు ♦ భోగిశయన
నవ్యగుణరంహ అల్లూరి ♦ నారసింహ! 50
సీ॥ ప్రతినిమేషము భక్తి ♦ భావంబు పెంపొంద
నీదివ్యనామంబు ♦ యీదిపల్కు
నిరతంబు మనమున ♦ పరమ మంగళరూప
మునుగాంచి సంతసం ♦ బెనయుచుండు
అనుపదంబును వాద ♦ మును కాంచి నీ విగ్ర
హార్చన కరములఁ ♦ గూర్చునెపుడు
పరదైవతంబుల ♦ ప్రాపుఁబొందక శీర్ష
మును మోడ్చు నీచెంత ♦ మోదమలర
తే॥ గీ॥ భక్తవరుడెంత ధన్యుఁడో ♦ శక్తికొలది
యింద్రియంబుల నన్నింటి ♦ తంద్ర నుడిపి
నీకు పరతంత్రములఁ జేయు ♦ నిశ్చలమతి
నవ్యగుణరంహ! అల్లూరి ♦ నారసింహ! 51
సీ॥ తన కులాచారంబు ♦ తప్పకుండగ కర్మ
నిష్ఠ బూని చరించు ♦ శిష్టుడొకడు
భక్తిమార్గంబును ♦ రక్తితోఁ గైకొని
సతతంబు సేవించు ♦ సరసుడొకడు

ఇలగల జీవకో ♦ టుల నెల్ల కారణు
ఘనునాత్మఁ జింతించు ♦ జ్ఞానియొకడు
వస్తుజాతంబెల్ల ♦ వడి నాశమొందుటల్
రహిఁగాంచి మించు వి ♦ రాగి యొకడు
సీ|| ఇన్ని త్రోవలు నిన్నుఁ జేర ♦ నేర్పడంగ
నొక్కటను జేర కక్కటా ♦ మొక్కలులుగ
జగతికాలంబుఁ బుత్తురు ♦ జాల్మ లరయ
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా! 52
సీ|| అరుణోదయంబున ♦ నైదు గడియలముందు
నిష్టదేవత సంస్మ ♦ రించి లేచి
గురుదేవతాస్తుతుల్ ♦ పరగించి ధాత్రిని
వేడి సవ్యపదంబు ♦ నిడి వెలుపల
నరిగి కల్యంబుల ♦ బరగించి యిలుజేరి
స్నాన సంధ్యోపాస ♦ నముల భక్తిఁ
గరిచి కులనిష్ఠ ♦ దొరగని విధమున
నర్థసంచయ మిచ్చ ♦ ననువుపరచి
సీ|| పిదప మధ్యాహ్నిక క్రియల్ ♦ సదమలమతి
జరిపి యభ్యాగతాతిథి ♦ సంప్రమోద
మొప్పఁ జరియించు మనుజుండు ♦ పూజ్యుడగును
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా! 53
సీ|| యజ్ఞ యాగాదిక ♦ మగు శ్రౌత విధులెల్ల
సత్యవాక్యముఁ బోల ♦ జాలవరయ
స్నాన సంధ్యాదిక ♦ స్మార్త కర్మములెల్ల
సత్యవాక్యముఁబోల ♦ జాలవరయ

నిఖిల దైవతనిష్ఠి ♦ తాఖిల తపములు
సత్యవాక్యముఁబోల ♦ జాలవరయ
సప్త సంతాన సం ♦ ప్రాప్త పుణ్యంబులు
సత్యవాక్యముఁబోల ♦ జాలవరయ
తే॥ గీ॥ సత్యమున సర్వజగములు ♦ వ్యత్యయమరి
నిరతిశయ సౌఖ్యమొందగా ♦ నెమ్మిఁగాంచు
సత్యరూపుడవీవెకా ♦ సత్య! వరద!
సవ్యగుణరంహ అల్లూరి ♦ నారసింహ! 54
సీ॥ తనవెంటరాదుగా ♦ ధనము బాధకమౌటె
ఫలముగాకిలనేమి ♦ కలుగుదాన
పేదరికంబోక ♦ వేదురంచుఁ దలంత్రు
తలపనయ్యది స్వర్గ ♦ ద్వారమగును
పేదవానికి కాపు ♦ బాధ యొకించుక
లేక మానసమున ♦ శోకసుఖము
పొంది నిర్మలభక్తి ♦ నందఁగల్గు సతంబు
నందుచే సద్గతిఁ ♦ బెంద గల్గు
తే॥ గీ॥ గాన ధనవాంఛ కడు ♦ హేయమైన గుణము
దానివీడిన వాడెపో ♦ ధన్య తముడు
మాన్యతను గాంచు జగతిన ♦ నన్యగతిని
సవ్యగుణరంహ అల్లూరి ♦ నారసింహ! 55
సీ॥ తరుణి సంగాతంబు ♦ దరిలేని జలనిధి
కామజలంబుల ♦ ఘనతగాంచు
మోహాది జంతు సం ♦ దోహంబుతోఁ గూడి
మనుజున కతిదుర్గ ♦ మంబు నగుచు

జీవితనౌకను ♦ జేరంగ నీయదు
సుకరంబుగా నొడ్డు ♦ నకు సతంబు
తృప్తియన్ చుక్కాని ♦ తివిరి కైకొనకున్న
భంగంబు పాల్పడి ♦ పాటు తప్పు
తే॥ గీ॥ గాన నిరతంబు తృప్తిచే ♦ కొనుట మేలు
తృప్తిఁ గాంచని వారలు ♦ తేకువ చెడి
మున్ను పలుకష్టములఁ జెంది ♦ మోసపోరె
నవ్యగుణాకరంహా! అల్లూరి ♦ నారసింహా! 56
సీ॥ పుత్రులపై రక్తి ♦ పొంది మానవుఁ డెట్టి
కల్మషంబులనైనఁ ♦ గడుగుసేయ
వారలఁ బోషింప ♦ వలయు ధనంబుల
సమకూర్ప బలుకష్ట ♦ జాలమొందు
ఆహారనిద్రల ♦ నైన గైకొనకెంతొ
ధనసంగ్రహంబున ♦ దత్పరుడగు
తాను దేహముఁ బాయు ♦ తరుణమే తెంచిన
వారల మేలుకే ♦ వాంఛసేయు
తనదారిఁ గనఁగోరి మన ♦ మార నిన్నుఁ జేరి
నుతిసేయ మతిజేయు ♦ డితరముడిగి
తే॥ గీ॥ తుదకు కాలునిదూతల ♦ యదలుపులకు
మది కలంగగ బిట్టేడ్చు ♦ ను దిలపడుచు
మొదటఁ గానంగనైతి నం ♦ చదవదపడి
నవ్యగుణాకరంహా అల్లూరి నారసింహా! 57
సీ॥ ఈషణత్రయముచే ♦ భూషితుండగు నరుం
డీ పత్తు సౌఖ్యంబు ♦ నెందుఁ గనఁడు

దారీషణంబది ♦ దరిఁగాననీయడు
జన్మాంతమును దాని ♦ జనదుపాయ
పుత్రీషణంబుకు ♦ పాత్ర్యమైన నరుండు
సకల దుష్కర్మముల్ ♦ సాగఁజేయ
అధనీషణమను ♦ బాధ పాల్పడు మర్త్యు
డింగితంబును వీడ్వ ♦ డంగఁ దనరు
తే॥ గీ॥ దారపుత్రధనీషణల్ ♦ దాపురించి
మర్త్యకోటిని బాధించు ♦ మాడ్కిఁగనియు
వాని విడలేరు మానవుల్ ♦ పూనికమెయి
నవ్యగుణరంహ ! అల్లూరి ♦ నారసింహ ! 58
సీ॥ ముల్లోకములఁ గల్గు ♦ పల్లవాధరులను
గరయుకోరిక దశ ♦ కంఠుడాత్మ
దులకింప నద్దెసల్ ♦ దోర్బల నృత్తిచే
జరియించి కాంచిన ♦ జవ్వనులను
బలవంతమున దెచ్చి ♦ బంధనంబున నిడి
తుచ్ఛసుఖంబుల ♦ నిచ్ఛఁ జేసి
మహిజాతఁ గొని చని ♦ యహమికలంకలో
నునిచిన సహసైన్యు ♦ దునిమి వాని
తే॥ గీ॥ సీతఁ గైకొంటి వనుముమ్న ♦ శ్రీనివాస
కామ గుణమునఁగాదె ర ♦ క్కసుడు చెడుట
అట్టి కామంబు విడనాడ ♦ చెట్ల తొలగు
నవ్యగుణరంహ ! అల్లూరి. ♦ నారసింహ ! 59
సీ॥ క్రోధగుణంబను ♦ వ్యాధిమానవులకు
వారింపగానిదై ♦ పేరుఁగాంచు

తల్లిదండ్రులటంచు ♦ దారయంచును బంధు
వారమంచును బుద్ధిఁ ♦ జేరనీదు
తనమాటకడ్డమై ♦ ఘననీతి పల్కిన
గానిరుద్రుని రూపుఁ ♦ గాంచునరుడు
కూడని పనులెల్లఁ ♦ గొంచక నొనరించు
లోకాపవాదంబు ♦ జోకఁగనడు

తే॥ గీ॥ అట్టిక్రోధమ్మునను జేర ♦ నట్టిసరణి
భక్తిభావంబు ప్రబలంగ ♦ పరమ పురుష
నీ పదాబ్జయుగంబు ధ్యా ♦ నింతు మదిని
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా! 60

సీ॥ లోభంబుననుమీరి ♦ లాభంబు మదిఁగోరి
కురుపతిరాజ్యంబు ♦ కొరకు పెక్కు
దుష్టకార్యంబుల ♦ దుర్నీతి నొనరించి
బాయాదులౌ పాండు ♦ తనయులకును
పలు తెరంగుల కష్ట ♦ ములు కల్గఁజేసిన
నోర్పుమీరఁ జరించి ♦ యుచితవృత్తి
పాలుగోరిన నీక ♦ బేలయై వర్తింప
ఘోరాహవంబునఁ గూల్చివాని

తే॥ గీ॥ పుడమిఁ గొనలేదె పాండవుల్ ♦ పొడుగుపడెనె
లోభగుణమును బాపెడు ♦ ప్రాభవమిడు
నిన్నెనమ్మితి ననుగావు ♦ నీరజాక్ష!
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా! 61

సీ॥ మోహగుణంబది ♦ యూహింపరుగా సర్వ
మానవప్రతతికి ♦ మహాంతరోగ

మదిజనించినదాది ♦ మనము బల్ చిక్కల
పాలుగా కడగండ్లఁ ♦ బడుసతంబు
ఏకాగ్రతను బాపు ♦ యింగితం బెడలించు
ధర్మమార్గముఁ బాపు ♦ శర్మముడుపు
పలురకంబుల దుష్ట ♦ భావముల్ మొలకెత్తు
సన్మార్గ నిరతుల ♦ జాడగనడు
తే॥ గీ॥ అట్టి మోహంబు పాల్పడి ♦ బిట్టునవయు
వారలను గాంచియుఁగ విడఁ ♦ గోరరకట
జ్ఞానలేశంబు లేనట్టి ♦ హీనమతులు
సర్వగుణరంహ అల్లూరి ♦ నారసింహ! 62
సీ॥ మదగుణం బది సర్వ ♦ మానవ కోటికి
కష్టముల్ సమకూర్చు ♦ ఘనతఁబాపు
తనపరబలముల ♦ తారతమ్యము వీడి
పరుఁబల వంతుని ♦ నోరయ బూను
నందు సర్వవినాశ ♦ మొందుట గల్గును
పెక్కండ్రు మదమున ♦ నుక్కసెడిరి
కనకాక్షు డున్మద ♦ క్రమమున రూపఱె
నెందరో దుష్టులు ♦ క్రుమ్మందిచనిరి
తే॥ గీ॥ అట్టి మదగుణమే పట్టు ♦ బెట్టుబట్టి
చెట్టలను బట్టుగాంచుచు ♦ రట్టు పడుట
దిట్టతనమా నె బుధునకీ ♦ గుట్టుతెలియు
సర్వగుణరంహ అల్లూరి ♦ నారసింహ! 63
సీ॥ మాత్సర్యమును బూని ♦ వాత్సల్యమును వీడి
మును హిరణ్యాక్షుడఁగ ♦ దనుజపరుడు

భక్తవరుండైన ప్రహ్లాదుఁ బలువిధ
దండనలను గూర్చి ♦ దాక్ష్యముడిగి
చెట్టచేతలఁ జేయ ♦ దిట్టతనంబున
రూపుమాపగఁ జేయు ♦ కోపుజూపి
చీల్చి చెండాడితి ♦ చెట్టయా మత్సర
గుణమింత చేసెనా ♦ కుత్సితాత్మ
తే॥ గీ॥ నట్టి మాత్సర్యమునుబూని ♦ యనవరతము
సింగులను గాంచఁబోలదే ♦ యలఘుమతికి
సకల కళ్యాణగుణాభూష! ♦ సాధుపోష!
నవ్యగుణరంహ అల్లారి నారసింహ! 64

సీ॥ కామంబుక్రోధంబు ♦ ఘనలోభమును మోహ
మదమత్సరత్వముల్ ♦ మానినడుచు
మనము నిర్మలముగా ♦ నొనరించి నిరతంబు
నీ పదభక్తిని ♦ నెమ్మిఁజేర్చి
ఇతర చింతలమాని ♦ ఈశ్వరు పరునిన్ను
సేవించినంతనే ♦ చెడునుతమము
పూర్వజన్మార్జిత ♦ భూరిపాపంబులు
దూదిపింజలరీతి ♦ తొలగిపోవు
తే॥ గీ॥ నిత్య నిరవద్య పదవి సం ♦ స్తుత్యముగను
పొందనేర్తును సిద్ధంబు ♦ భోగిశయన!
ఆర్తగజసరక్ష! పుండరీ ♦ కాయతాక్ష!
నవ్యగుణరంహ అల్లారి ♦ నారసింహ! 65

సీ॥ శమము దమంబును ♦ జాలతి తీక్షయు
శ్రద్ధసమాధాన ♦ సదుపరతియు

గలిగి యిహాముత్ర ♦ ఫలభోగ వర్జనం
బాత్మయనాత్మ భే ♦ దావలోక
నంబును గాంచి మహా ♦ నంబు పూని ముముక్షు
తను పొందనేర్చిన ♦ ఘనుడె ముక్తి
పదముఁ జేరగనేర్చు ♦ పదపడి యదిలేని
మనుజుడు పొరిపొరి ♦ జనన మరణ।
తే॥గీ॥ రూప సంసార వార్నిధి ♦ లో పడంగ
దరిని జేరంగనయ్యెడు ♦ వెరవుఁ గనడు
దీనజనపాల! వేదవి ♦ దేకలోల!
నవ్యగుణరంహ! అల్లూరి♦నారసింహ! 66
సీ॥ నిరతంబు నీరూపు ♦ నెమ్మది జేరిచి
యితరచింతలమాని ♦ యిచ్చకొలది
నీ నామములు నోట ♦ నీమంబునను పల్కు
టొండె భవన్మంత్ర ♦ మండగొనుచు
జపవిధిగైకొని ♦ సాంగవిధ్యుక్తమౌ
తపమొనర్చుట యుండె ♦ తాల్చి దీక్ష
అజీవితాంతంబు ♦ నాచరించిన ఘనుం
డార్త రక్షావనుం ♦ డైన నీదు।
తే॥గీ॥ లోకమును గాంచి సతతంబు ♦ నీ కటాక్ష
వీక్షణముఁ గాంచనేర్చును ♦ వేదవేద్య!
భక్తజనపోష! కాంచనాం ♦ బరసువేష!
నవ్యగుణరంహ! అల్లూరి ♦ నారసింహ! 67
సీ॥ ఏ శాస్త్రములు నేర్చె ♦ నేర్పడ శబరితా
నేమంత్రజపవిధి ♦ నెసగె యుడుత

ఏ తపంబును జేసె ♦ నెచ్చుగాబోయడు
ఏ వ్రతదీక్ష మ ♦ న్నించె రాయి
ఏ నామ భజనంబు ♦ తా నాచరించెను
రాక్షసాన్వయ జాతు ♦ డైన పరు
ఏ యజ్ఞ యాగముల్ ♦ పాయక నొనరించె
వనచరుడైనట్టి ♦ వాయుసుతుడు॥
తే॥గీ॥ నిరతమును నీదు సేవచే ♦ నెమ్మిగనిరి
సకలశాస్త్ర పురాణముల్ ♦ చర్చసేయ
నీ పదాంబుజ సద్భక్తి ♦ నిష్ఠఁ జెప్ప
నవ్యగుణరంహ అల్లూరి ♦ నారసింహ!
సీ॥ వేదవేదాంగముల్ ♦ విశ్రుతంబుగ నేర్వ
జ్ఞానంబు కల్గగా ♦ గలదె జగతి
నిరతంబు సత్కర్మ ♦ నిరతిఁ జెలంగిన
జ్ఞానంబు కల్గగా ♦ గలదె జగతి
అష్టాంగ యోగంబు ♦ లభ్యసించిననైన
జ్ఞానంబు కల్గగా ♦ గలదె జగతి
తంబురచేబూని ♦ తన్మయుడై పాడ
జ్ఞానంబు కల్గగా ♦ గలదెజగతి
గీ॥ నీ యనుగ్రహసిద్ధిచే ♦ నెమ్మిఁగాంచి
వరలకుండిన నెటువంటి ♦ వారికైన
భక్తజనరక్ష! పాండవ ♦ భరణదక్ష!
నవ్యగుణరంహ! అల్లూరి నారసింహ!
సీ॥ నీ కటాక్షముచేత ♦ నీరజ మిత్రుండు
చంద్రుండు పూజ్యతఁ ♦ జాలగనిరి

నీ కటాక్షముచేత ♦ నీరజగర్భుండు
లోకముల్ సృష్టించు ♦ వీకఁగాంచె
నీ కటాక్షముచేత ♦ నీరజవాసిని
కలుముల వెలదియై ♦ ఘనతఁగాంచె
నీ కటాక్షముచేత ♦ నిఖిలదైవతకోటి
భద్రముల్ గాంచంగ ♦ బరగె సతము
తే॥ గీ॥ నీ కటాక్షంబుఁ గాంచంగ ♦ నేరకకట
బహుళ తపములుజేసియు ♦ ప్రాభవమటి
రావణాదిక రాక్షస ♦ రాజితూలె
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా! 70
సీ॥ నీయురంబునఁ జేరి ♦ పాయక శ్రీకాంత
సంపత్ప్రదాత్రియై ♦ జానుమీరె
నీహస్తమునజేరి ♦ నెమ్మి సుదర్శన
చక్రంబ వక్రమై ♦ జగతి మీరె
నినుమోసి గరుడుండు ♦ నిఖిల పతత్రుల
రాజత్వమును కాంచి ♦ రాణగనియె
నీకు పర్యంకమై నిరతంబు శేషుండు
అఖిలలోకంబుల ♦ నమరెఖ్యాతి
తే॥గీ॥ నీదుమహింబు నెన్నంగ ♦ నేరి తరము!
ఉపనిషద్బోధ తాత్పర్య ♦ యోగభాస!
సకలగుణవాస! సర్వలోకైకలాస!
నవ్య గుణరంహా! అల్లూరి ♦ నారసింహా॥ 71
సీ॥ బహు పురాణంబులు ♦ పఠియింపగానేమి
సకల శాస్త్రంబులు ♦ చదువనేమి

నిఖిల వ్రతంబులు ♦ నెరవేర్చితే నేమి
చెలగి యుపన్యాసముల్ ♦ సెప్పనేమి
తాళంబుల యయును ♦ తప్పకుండగ గీత
ములుపాడి సభలను ♦ సలుపనేమి
శిష్య పరంపరల్ ♦ ప్రేష్యులై కొలువంగ
గురుత నెంతయుఁ గాంచి ♦ పరగనేమి
నీకటాక్షంబుఁ గనదేని నెమ్మిగనదు
గారడీవాని విద్యలై ♦ కడకుచెడవె
ఆర్తరక్షణ దీక్ష! ప ♦ ద్మాయతాక్ష!
నవ్యగుణరంహా! అల్లూరి నారసింహా! 72
అక్షమాల ధరించి ♦ నంతనే నేమగు
పాదుకల్దొడిగిన ఫలమదేమి
దండక మండలుల్ ♦ ధరియించగానేమి
కాషాయ వస్త్రంబుఁ ♦ గట్టనేమి
పరమహంస యనంగఁ ♦ బరగిన ఫలమేమి
శిష్య సంతతిఁ గాంచి ♦ చెలగనేమి
సభలలో నుపన్యా ♦ సములు పల్కగనేమి
గ్రంథముల్ రచియించి ♦ గ్రాలనేమి
తనకు నిర్దిష్ట వర్తనం ♦ బనువు పడక
కనకమును కాంతలను వీడు ♦ ఘనతఁగనక
మసలు నరుడెంత వేత్తయే ♦ నసముగనదు
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా! 73
సనకస నందన ♦ ముని జాతమే దేవు
నేకాంత భక్తితో ♦ నెగడుచుంద్రు

వనచరకోటులు ఘనభీతి నెక్కొ_న
నడుగిడఁ జాలక ♦ తడయుటఁ గని
వాహినీ నాథుండ ♦ వైన నీరాకకు
వాహినీ నాథుండు ♦ వంచనమెయి
గారవంబును చూపి ♦ కాన్పింపకున్నను
పటుతర దోష సం ♦ ఘటితమైన
తే॥ గీ॥ మానసంబున గర్వంబు ♦ మాపితౌర
సకలలోకాతి భీకర ♦ ప్రకటశౌర్య
ఘటితబాణాసనోజ్వల ♦ కాండలసిత!
నవ్యగుణరంహ! అల్లూరి ♦ నారసింహ! 78
సీ॥ బుడబుడధ్వని తోడ ♦ వడివడి బాణముల్
జడధిలో దూరి వే ♦ సడమొనర్ప
జలజంతు సంతాన ♦ మలసత్వమును బాసి
కలగుండు వడిబట్టు ♦ కలగిపర్వ
కల్లోలితోత్తుంగ ♦ ఘనతరంగ చయంబు
మిన్నాక చెలిమి కై ♦ మేల్మిసూప
విలయకాలాత్యంత ♦ వీక్షిత బడబాగ్ని
రేగి నల్దిక్కు_ల ♦ రెమ్ముకొనగ
తే॥ గీ॥ ప్రకట బాణాసనోత్సి క్త ♦ పటుశరములు
హోవడింగూర్పఁ బరపితి ♦ చేవమెరసి
జలధి గర్వాంధకారంబు ♦ సన్నగిలగ
నవ్యగుణరంహ! అల్లూరి ♦ నారసింహ! 79
సీ॥ ప్రళయకాలానల ♦ జ్వాలకై వడినీదు
బాణాగ్ని కాల్పగాఁ ♦ బడలుపడియు

జంభారి దంభోళి ♦ జృంభణంబును మీరి
దంభాలి రేక సం ♦ రంభమునను
చెన్నుమీరెదు నిన్ను ♦ జేరి సంప్రార్థింప
పరమదయారస భావమునను
శాంతించి జలధీశు ♦ సన్నుతుల్ వివిరియొందు
తీరంబుఁ జేరగా ♦ దారినడుగ

తే॥గీ॥ నలుడు సేతువు నిర్మింప ♦ గలడు వాని
వలన కడతేరు నాపని ♦ సులభమనుచు
జెప్పి యుధధీశు డేగ నీ ♦ మెప్పు నొంది
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా! 80

సీ॥ శాఖామృగావళి ♦ శైలముల్ వడి తెచ్చి
వనధిలో వైచిన ♦ మునుగకుండ
నలుని హస్తస్పర్శ ♦ బలమున తేలంగ
పదియామడ వెడల్పు ♦ పరగునటుల
నూరు యోజనముల ♦ వారిధిసేతువు
వెలయించి వాహినుల్ ♦ బలసికొల్వ
నవ్వాలి దరిఁజేరి ♦ యసురాధిపుని ప్రోలు
ముట్టడి సేయంగ ♦ మొనసియతడు

గీ॥ చివ్వకైసేనగూడి కా ♦ లుద్విరాగ
పరుల హృద్భేదనంబుగా ♦ వరలు తేజు
నెనసి యనుజునితోఁగూడ ♦ ననికి నిల్చి
రాక్షసానీక మడ్డితి ♦ రామచంద్ర
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా! 81

సీ॥ కమలవాసినిఁ గన్న ♦ కానుపు పున్నెంబొ
అమరులకమృతా ♦ హార ఫలమొ
జీవనదాతయై ♦ చెలగిన మేల్మియో
రత్నాకరుండైన ♦ రాణ మహిమొ
అంజనేయునికిడ్డ ♦ యర్చనాఫలితంబొ
వరతపశ్శాలుర ♦ స్వర్శబలమొ
దైవాత్ముకుని కాంచి ♦ చెలగిన సుకృతంబొ
జంతుసంతతికి నా ♦ శ్రయ గుణంబొ
తే॥ గీ॥ నీదు బాణాగ్ని కగ్గమై ♦ యెలమిఁ గనుట
సాగరునికిట్టి శ్రేయంబు ♦ జాలెకనగ
పరమకారుణ్యమూర్తివై ♦ పరగు కతన
నవ్యగుణారంహా! అల్లూరి ♦ నారసింహా! 82

సీ॥ ఆవులించినమాత్ర ♦ నఖిల భూతంబులు
కలగుండు వడిదిక్కు ♦ లొలయఁగాంచు
ఉశ్వాస నిశ్వాస ♦ మొనరించుగా జీవ
సంఘుంబులోబయల్ ♦ చాలు సొరగ
అట్టిట్టుపొర్లిన ♦ నవని కంపము నొందు
కాననపర్వ తొ ♦ త్కరముతోడ
అడుగుపెట్టిన యంత ♦ నంబుధులుప్పొంగి
ధరణిపై కెగబ్రాకి ♦ దరమొసంగు
తే॥ గీ॥ అట్టియతిమాత్రకాయుడై ♦ యఖిలలోక
భూత సంక్షోభ కారణుం ♦ డై తనర్చు
కుంభకర్ణుని దురమునఁ ♦ గూల్చినావు
నవ్యగుణారంహా! అల్లూరి ♦ నారసింహా! 83

సీ॥ తన శస్త్రసంపాండితి ♦ ఘనత సురేంద్రుని
బందీకృతునిఁ జేసి ♦ పరిభవిల్ల
తన తపోమహిమ దు ♦ ర్ధర్ష తేజమొసంగి
సమరాంగణమ్మున ♦ సాగి మెరయ
తన మాయ కౌశలం ♦ బను పదంబరులకు
మేకొనఁ జా ♦ లని మిత్తికాగ
తన రథశస్త్రాళి ♦ ఘనమార్గగమ్యమై
ప్రతి వీరకోటికి ♦ మతిఁ గలంప

తే॥ గీ॥ సకలలోకాతి భీకర ♦ సంగరుఁడగు
ఇంద్రజిన్నాముఁడౌ రావ ♦ ణేంద్రు సుతుఁడు
నీ పరాక్రమ కాలాగ్ని ♦ రూపుమాసె
నవ్యగుణరంహ ! అల్లూరి ♦ నారసింహ ! 84

సీ॥ తన పాదఘట్టనం - బున భూమి పరియలై
కైలాస శిఖరంబు ♦ కంపమొంద
యిరువదిచేతులు ♦ బరువడిఁ జొప్పించి
పాతును కదలించి ♦ పైకిలేప
పర్వతరాట్పుత్రి ♦ భయమొంది తన కాంతు
కౌగిట వణకంగ ♦ కలయఁ జూచి
పరమేశు డుగ్రుఁడై ♦ భవ్యపాదాంగుష్ఠ
మున నొక్కినం తన ♦ యుక్కుఁ దక్కి

తే॥ గీ॥ చేతులన్నియు గిరిక్రిందఁ ♦ జిక్కి బొక్కి
పరమ వాత్సల్యమునఁ బ్రోచె ♦ గిరిశుడట్టి
రావణుఁడు నీ శరాగ్నికి ♦ రాణ చెడియె
నవ్యగుణరంహ ! అల్లూరి ♦ నారసింహ ! 85

సీ॥ తన పరాక్రమమును ♦ విని దిగీశావళి
మున్మున్నె జోహార్లు ♦ మొనయఁ జేయ
తన పాదఘట్టన ♦ ధగసకాననపర్వ
తములతో కంపించి ♦ తల్లడిలగ
తన దుర్నిరీక్ష్య తే ♦ జన సూర్యమండలం
బద్దంబు కైవడి ♦ బాయకాంతి
తన సింహగర్జనం ♦ బున శత్రుభూపతి
కాంతల గర్భముల్ ♦ కలగి జార
గీ॥ గ్రహములన్నియుఁ గతిసెడి ♦ కలసి పర్వ
విక్రమంబున లోకంబు ♦ లాక్రమించి
మించు రావణునటు సంహ ♦ రించినావు
నవ్యగుణరంహ! అల్లూరి ♦ నారసింహ! 86

సీ॥ వనచరకోటులు ♦ వార్ధి బంధించగా
ఘనప్రాభవంబును ♦ కాంచఁ గనుట
లోకాతిభీకర ♦ ప్రాకట పటుశౌర్య
దర్పిత దితిజాగ్ని ♦ నార్పఁగనుట
ద్వైవాసపాళికి ♦ దుష్కరంబననైన
పుష్పకారోహణం ♦ బొప్పఁ గనుట
సకల భూతోత్సవ ♦ ప్రకటమా పట్టాభి
షేకంబుఁ గని సంత ♦ సించఁ గనుట
తే॥ గీ॥ పోల బహుజన్మ సంస్కార ♦ పుణ్యమునను
నీ మహత్తర సాంగత్య ♦ నియమమునను
గాక వేరొంట గల్గునే ♦ కమలనయన
నవ్యగుణరంహ! అల్లూరి ♦ నారసింహ! 87

సీ॥ నీ నామకీర్తనల్ ♦ నెరపిన పుణ్యుండు
నిను మనంబునఁ జేర్చి ♦ నెగడుఘనుడు
నీ రూపమునుకాంచి ♦ నెగడెడు సుకృతుండు
నీ కథల్ వీనుల ♦ సోకుమహితు
డతిభక్తి నీ పూజ ♦ నలరెడు కర్మఠుం
డతిథి సంతర్పణ ♦ నడుపు సుమతి
సకల జీవులలోన ♦ ప్రకటంబుగానీదు
తేజుఁ గాంచగ గల్గు ♦ ధీయుతుండు
తే॥గీ॥ నిరత కల్యాణవైభవో ♦ న్నిద్ర 'పదము
జేరి సారూప్యముక్తినిఁ ♦ జెందుటరుదె
పరమదాక్షిణ్యమూర్తి! హృ ♦ త్పద్మవర్తి
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా! 88
సీ॥ కాళీయ ఫణిమౌళి ♦ కేళీనటద్వర్త
నాళీకసంపద ♦ నమరెనెద్ది
గాంగేయజని కార ♦ ణాంగీయ స్వర్గంగ
సాంగత్యమున దాచె ♦ లంగెనెద్ది
పాకశాసన ముఖ్య ♦ నాకౌక సాస్తోక
ప్రాకామ్యదాయియై ♦ పరగెనెద్ది
శర్వరీచరనాథ ♦ గర్వ నిర్వాపణా
ఖర్వ సత్కృతితోడ ♦ బర్వెనెద్ది
తే॥గీ॥ శ్రీ లతాంగి కరస్థమై – గ్రాలునెద్ది
యోగిభంభర సంసేవ్య ♦ యోగమెద్ది
అట్టి నీ దివ్యపదము చే ♦ పట్టినాడ
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా! 89

సీ॥ పాండవ సుతపక్ష ♦ భక్తాళి సంరక్ష
ఆశ్రితామర వృక్ష ♦ అంబుజాక్ష
కమలామనోహర! కారుణ్యసాగర!
భక్తార్తి మిర ది ♦వస్పతివర!
సారసదళనేత్ర! ♦ జలద సన్నిభగాత్ర!
గౌరీశమానస ♦ కంజమిత్ర!
మారకోటి విలాస! ♦ మాని మానసవాస!
శ్రీమానినీ చిత్త ♦ స్థిరనివాస!
తే॥ గీ॥ సర్వసురగణ సంసేవ్య! సాధుభావ్య!
దివ్యసుందర విగ్రహా! ♦ భవ్యదేహా!
కరుణ ననుబ్రోవుమయ్య ఆ ♦ తురుడనయ్య!
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా! 90
సీ॥ రాకాశశాంక ని ♦ రాకృత ముఖబింబ
సందర్శనోత్సుక ♦ సాధునిచయ!
పాకారి ముఖసర్వ ♦ నాకౌకసానీక
ప్రాకట సంరక్ష ♦ కైకదీక్ష!
రాత్రించరావళీ ♦ గాత్రసంఛేదన
సూత్రదక్షమనోజ్ఞ ♦ వేత్రపాత్ర!
భక్తసంరక్షణ ♦ శక్త! ముక్తిప్రద!
ప్రాక్తన పుణ్య సం ♦ సక్త రక్త!
తే॥ గీ॥ పుణ్యజన మానసాంబుజ ♦ గణ్యనిలయ!
భక్తపాలన దక్ష! సం ♦ భ్రమకటాక్ష!
రాక్షసాధీశ శిక్ష! ధ ♦ ర్మజ సుపక్ష!
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా! 91

సీ॥ జగతిఁ గల్గిన జీవ ♦ చయము పుట్టినదాది
గిట్టుట తథ్యంబు ♦ ఎట్టులైన
జీవిత మెంతయు ♦ భావించి సతమంచు
దారపుత్రవిమోహ ♦ తంతువులను
చిక్కి బంధనములఁ ♦ బొక్కుచు సతతంబు
విడివడు మార్గంబు ♦ బడయలేక
మానవజన్మంబు ♦ మహీవ్యర్థముగఁ బోవ
తుదకు హీనపు జన్మ ♦ లొందవబలి
తే॥ గీ॥ నిన్ను సేవింపజాలని ♦ నేరమునకు.
బహుళజన్మ పరంపరఁ ♦ బడుట నిజము
ఆర్తరక్షణ దక్ష! ర ♦ మాత్మవక్ష!
నవ్య గుణారంహ! అల్లూరి ♦ నారసింహ॥ 92
సీ॥ మాతృగర్భముఁ జేరి ♦ మసలుచు జీవుండు
వెలువడు మార్గంబు ♦ దెలియలేక
మలమూత్ర శోణితం ♦ బుల మునుంగుచు గర్భ
వేదనలకుఁ జిక్కి ♦ వెక్కసముగ
పూర్వజన్మార్జిత ♦ పుణ్యపాపంబుల
మనమునఁ దలపోసి ♦ వనటఁజెంది
నీ పదాబ్జయుగంబె ♦ నీమంబుతోఁ గొల్చి
భవసముద్రముఁ దాటి ♦ భద్రపదవి
గీ॥ గాంచి వర్తించెద నటంచు ♦ నెంచిమదిని
పుట్టుకను కాంచి నీభక్తి ♦ పొంతఁబోడు
నిత్యమును కాంతకనకముల్ ♦ నుత్యములగు
నవ్యగుణరంహ! అల్లూరి ♦ నారసింహ! 93

సీ॥ ఎన్నిజన్మంబుల ♦ నెత్తితినో యింక
ఎన్నిజన్మంబుల ♦ నెత్తవలెనొ
పుట్టుట గిట్టుట ♦ పొరిపొరిఁ బుట్టుట
యీభవాబ్ధికిఁ బార ♦ మెనయు టెపుడొ
గుడ్డెద్దు చేనిలోఁ ♦ బడ్డరీతిని కాల
మెడ్డె తనంబున ♦ సడ్డసేసి
జీవితంబుడివోవ ♦ నావల ఫలమేమి
బొందిలో ప్రాణముల్ ♦ పోకమున్నె
తే॥ గీ॥ నిత్య నిరుపమ భవదీయ ♦ నుత్యపదముఁ
జేర వాంఛించితిని కోర్కెఁ ♦ జిత్తగింపు
పతితపావన నామ! స ♦ ద్భక్త కామ!
నవ్యగుణరంహ! అల్లూరి ♦ నారసింహ! 94

సీ॥ నీ మంత్రజపనిష్ఠ ♦ కామియై బోయడు
మునిలోక శేఖరుం ♦ డనగఁ బరగె
నీ పదాంబుజసేవ ♦ ప్రాపించి మారుతి
బ్రహ్మపదంబుఁ దా ♦ బడయఁగల్గె
నీ సఖ్యమును కాంచి ♦ వాసరాధి పసూతి
కపిరాజ్య విభవంబుఁ ♦ గాంచిమించె
ఏర్చికూర్చిన పండ్లు ♦ యిచ్చి నీ కతిభక్తి
శబరి శాశ్వతమైన ♦ సద్మమెనసె
తే॥ గీ॥ నేను నిరతంబు సద్భక్తి ♦ నిన్నిగతుల
నిన్ను సేవింప దయలేదె ♦ నీరజాక్ష!
పండితామర వృక్ష! కృ ♦ పా కటాక్ష!
నవ్యగుణరంహ! అల్లూరి ♦ నారసింహ! 95

సీ॥ నీ మోముసిరిఁగాంచి ♦ నీరజారాతి తా
నిత్యకళంకిమై ♦ నెగడెజగతి
నీ మగంటిమిఁగాంచి ♦ నీరధినాథుండు
జడధియై బడబాగ్ని ♦ నడలెసతము
నీ యందమును కాంచి ♦ పాయకమదనుండు
అతనుఁడై నిచ్చలు ♦ వెతకలంగె
నీ తేజుఁ గనలేక ♦ నీరజ మిత్రుండు
ప్రతి పర్వమందుఁ దా ♦ భంగపడియె
తే॥ గీ॥ నీకు సరిపో లుదైవంబు ♦ నిఖిలలోక
ములను వెతకినఁ గానంగ ♦ పోలదెపుడు
భక్తరక్షణ శీల, కృ ♦ పావిలోల,
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా! 96
సీ॥ నీలమేఘశరీర ♦ నిజభక్త మందార
పాలిత సురవార ♦ పతితదూర
రాక్షస సంహార ♦ రణరంగ సంచార
కరుణారసోదార ♦ కంధిధీర
గోపీమనోహర ♦ గోవర్ధనోద్ధార
కామినీ జనమార ♦ కాంతిపూర
మానససంచార ♦ గానవిద్యాసార
మునిమనోంబుజశూర ♦ ముక్తిసార
తే॥ గీ॥ సర్వలోకాశ్రయోదార సమరశూర
కౌస్తుభాదిక కృతహారి ♦ ఘనవిహార
యోగిజన మానసాంబుజ ♦ యుక్ప్రచార
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా! 97

7

సీ॥ జలద సన్నిభగాత్ర ♦ సన్మునిస్తుతిపాత్ర
నీరజారాతి శే ♦ ఖర సుమిత్ర
గౌతమ కృతస్తోత్ర ♦ కంజాత భవపుత్ర
కమలా మనోంబుజ ♦ కంజమిత్ర
దైత్యశిక్షణ వేత్ర ♦ దర్పితారిల విత్ర
కరుణారసోదార ♦ వరచరిత్ర
కామినీవన చైత్ర ♦ కంజాత సమనేత్ర
సురసంఘపోషణ ♦ కరపవిత్ర

తే॥ గీ॥ నన్నుఁ గావుము వేడెద ♦ నలిననేత్ర
శత్రుసోదరుఁ దయజూపి ♦ సాకలేదె
భక్తసంచయలోల సం ♦ భావ్యశీల
నవ్యగుణరంహ! అల్లూరి ♦ నారసింహ! 98

సీ॥ కమలామనోహరా ♦ కారుణ్యసాగరా
జోహారు లానరింతు ♦ మోహముడుపు
తామరసాక్ష నా ♦ కామాది దుర్గుణ
గ్రామంబుఁ దొలగించి ♦ ప్రేమఁ బోవు
నీ భక్తియును నాక ♦ నిచ్చి భవాంబుధి
దాటంగఁ జేయు మో ♦ తాటకారి
సంసార బంధంబు ♦ హింసాకరంబగు
నది తొలంగఁగ జేయు ♦ మదన జనక

తే॥ గీ॥ పదిలముగ నీ పదంబుల ♦ పట్టువిడక
మానసంబున నిల్పితి ♦ మాననీయ
నన్నుఁ గాచెడి భారంబు ♦ నెన్న నీదె
నవ్యగుణరంహ! అల్లూరి నారసింహ! 99

సీ॥ కాలాభ్రసంకాశ ♦ కమనీయనిజదేహ
దేహభారీడిత ♦ దివ్యభావ
భావనామాత్ర సం ♦ భావిత సురగణ
గణనీయనిజ శౌర్య ♦ కలిత కీర్తి
కీర్తికాంతోజ్వల ♦ కేళీ విరాజిత
రాజిత సర్వామ ♦ రాళివినుత
నుతవిక్రమ క్రమ ♦ ప్రతిమానవర్జిత
వర్జిత విషయ ప్ర ♦ పంచ మహిత
తే॥గీ॥ మహిత సత్కార్య సంస్తూయ ♦ మాన పవిత
చరిత యోగీశ్వరాత్మ పం ♦ కరుహనిలయ
నిలయకృద సర్వజగదండ ♦ నీరజాండ
నవ్యగుణరంహ! అల్లూరి నారసింహ!
సీ॥ భక్తరక్షణ కళా ♦ పారీణ సద్భావ
భావజ రిపునుత ♦ భవ్యనామ
నామరూపాత్మ కో ♦ త్తమ జగత్కల్పన
కల్పనారహిత ♦ సత్క్రియ విభాస
భాసమానోజ్వలా ♦ ప్రతిమాన సద్రూప
రూపదర్శనమాత్ర ♦ ప్రాపితపద
పదవాక్య కలిత సం ♦ భావనాశ్రిత లోక
లోకాతిశాయిని ♦ రూఢతేజ
తే॥గీ॥ తేజసాంపతి శశియుత ♦ దివ్యనయన
నయనరాధిక సంరక్ష ♦ ణ ప్రభావ
భావకల్పిత జగదండ ♦ పద్మజాండ
నవ్యగుణరంహ! అల్లూరి ♦ నారసింహ!

సీ॥ రాక్షస వాహినీ ♦ శిక్షణ కోదండ
దండనీతివిలాస ♦ భండనవర
వరణీయ సద్రూప ♦ వాంఛిత మహిజాత
జాతరూపాంచిత ♦ పీతవసన
వసనహీనా ర్తివి ♦ ధ్వంసన కారణ
కారణాత్మక జగ ♦ త్కారణదక్ష
దక్షారినుతనామ ♦ తత్పర వరకీర్తి
కీర్తిత నిజ కథా ♦ కేళి మహిత
తే॥ గీ॥ మహితనూజాత చిత్తాబ్జ ♦ విహిత మిత్ర
మిత్ర శశినేత్ర నేత్రాబ్జ ♦పత్రభాస
భాసమానాత్మరూప సం ♦ భావనీయ
నవ్యగుణరంహ! అల్లూరి ♦ నారసింహ! 102

సీ॥ గోపీమనోంబుజ ♦ కుంజ సంతతవాస
చిన్మయ భాస యో ♦ శ్రీనివాస
బృందావనాంత సం ♦ వీక్షితని జరాస
భాసమానోజ్వల ♦ భవ్యహాస
భక్తరక్షణ కళా ♦ పారీణ గతదోష
రాక్షస సంహార ♦ రమ్య వేష
దివిజావళీరక్ష ♦ ణావహాసంతోష
రవికోటిదీప్తి ♦ కారణ విభూష
గీ॥ ధర్మసంరక్షణోదగ్ర ♦ ధన్యభాష
గర్వ జగదండ కల్పనా ♦ ఖర్వ తోష
క్షీరవార్ధిధివాస లం ♦ కేశ నాశ
నవ్యగుణరంహ! అల్లూరి ♦ నారసింహ! 103

సీ॥ కలుముల చేడియ ♦ నలరించు వగకాడు
వలరాజు పుట్టిక ♦ నలరు గేస్తు
పక్కిరాయల జక్కి ♦ నెక్కి నిక్కెడి రౌతు
దిక్కులన్నిటి నేలు ♦ మొక్కలీడు
రక్కసిమూకల ♦ నిక్కు జెక్కెడి బంటు
మొక్కలివానిని ♦ ముందు చుక్క
జక్కులరాయని ♦ కెక్కు నెచ్చలికొల్చు
నుక్కివుడాత్తుల ♦ నోముపంట
తే॥ గీ॥ వేలుపుల బోనముంగూర్చు ♦ వింతకాడు
దాసులకు వేల్పుగిడ్డియై ♦ తనరుదీవె
నతజనామరభూజ కా ♦ మిత మహీజ
నవ్యగుణరంహా! అల్లూరి నారసింహా! 104

సీ॥ నిరతంబు నీనామ ♦ స్మరణంబున భవాబ్ధి
తరణంబు సేయంగ ♦ నరుడు కాంచు
సతతంబు నీరూపు ♦ మతినుంచి నుతియించ
సతమైన నగతిఁ గాంచి ♦ వెతఁదొలంచు
అనుపదంబను పమ ♦ హర్ష దాయకమైన
నీపూజ పాపాళి ♦ యేపుఁ బాపు
అనుదినంబు త్వదీయ ♦ ఘనదివ్య చారిత్ర
మునుపఠించిన జ్ఞాన ♦ ముక్తులెనయు
తే॥ గీ॥ నిన్ను సేవించి కీర్తించి ♦ నినుఁ దలంచి
బహుళ దుఃఖపరంపరల్ ♦ బాయనేర్తు
పన్నగాశనశయ్యావి ♦ భాసమాన
నవ్యగుణరంహా! అల్లూరి ♦ నారసింహా! 105

సీ॥ కాళీయఫణిఫణా ♦ కేళిఁమీరిన దెద్ది
బలిశిరంబున నిల్చి ♦ వెలసె నెద్ది
ముల్లోకపావని ♦ మొనయఁ జేసిన దెద్ది
భక్తమానస కంజ ♦ వాసమెద్ది
మిథిలేశు కరమున ♦ ప్రథగాంచగనె నెద్ది
గుహునికి తీర్థంబుఁ ♦ గూర్చె నెద్ది
శ్రీకాంతయంక పీ ♦ ఠికఁ జెలంగున దెద్ది
మునికాంత నిజరూపు ♦ మనిపె నెద్ది
తే॥ గీ॥ నాదు మానస పంజరాం ♦ తరమునందు
భద్రముగ నిల్పి సేవింపఁ ♦ బరగు నెద్ది
పతితపావనమైన నీ ♦ పదయుగంబె
నవ్యగుణరంహ! అల్లూరి ♦ నారసింహ! 106

సీ॥ గిరిపుత్రి వేడిన ♦ గిరిశుడిచ్చిన మంత్ర
మాంజనేయునకు నీ ♦ తాబ్జనేత్ర
ఆదరంబున నిచ్చి ♦ నట్టి మంత్రము బోయ
వాల్మీకికైనట్టి ♦ పరమమంత్ర
మంబుజగర్భాదు ♦ లగు దేవతా నీక
మతిభక్తి జపియించు ♦ నట్టి మంత్ర
మనవరతంబునే ♦ నతిశ్రద్ధ జపియించి
తరియించఁ గోరితి ♦ దాపుసేర్చి
తే॥ గీ॥ నన్ను జేకొని కావవే ♦ నలిననయన
పన్నగాశన భూషణ ♦ సన్నుతపద
భక్తజన రక్ష! శ్రీకాంత ♦ సక్తవక్ష
నవ్యగుణరంహ! అల్లూరి ♦ నారసింహ! 107

సీ॥ సీసపద్యంబులఁ ♦ జేసితి శతకంబు
గాసిదొలంచినఁ ♦ వాసిఁగూర్పు
యల్లాప్రగడ వంశ ♦ కల్లోలి నీకాంతు
నకు శీతభానుఁడౌ ♦ నటుఁజనించి
వెంకటసుబ్బరా ♦ వన్ననామము దాల్చి
సిరిపూడిగ్రామంబు ♦ చెలగవాస
మతిభక్తి నిచ్చలు ♦ మతిబూని వెతమాని
నిన్నుఁగొల్చుచుంటిని ♦ నీరజాక్ష

తే॥ గీ॥ అన్యదైవతములజాడ ♦ నరయబోను
నీ పదంబులె నమ్మితి ♦ నిజముగాను
నీ పదంబిడి బ్రోవంగ ♦ నిష్ఠఁ బూను
నవ్యగుణరంహ! అల్లూరి ♦ నారసింహ! 108

—*సమాప్తి*—

| | | | |
|---|---|---|---|
| 26 | 10 | యూది | లూది |
| 28 | 6 | నెమ్మిం | నెమ్మి |
| 30 | 1 | నీయడు | నీయదు |
| ,, | 4 | దుష్కముల్ | దుష్కృత్యముల్ |
| ,, | 12 | గరయు | గవయు |
| 31 | 9 | ద్యానింతు | ధ్యానింతు |
| ,, | 23 | పరుగా | పగా |
| 33 | 14 | నోరయు | నౌరయు |
| ,, | 19 | బెట్ట | చెట్ట |
| ,, | 24 | పరుడు | వరుడు |
| 39 | 1 | రుండై | రుండైన |
| 42 | 15 | చుగా | చగా |
| 47 | 8 | ఃలి | బడలి |
| 48 | 16 | బ్రహ్మ | బ్రహ్మ |
| 50 | 14 | లాన | లోన |
| 51 | 2 | ఘాకీ | ధారీ |